# స్వాతంత్ర్యదీప్తి

(దేశభక్తి గేయాలు)




రచన :

డా॥ వక్కలంక లక్ష్మీపతిరావు

భూపయ్య అగ్రహారం,

అమలాపురం – 533 201.

ముద్రణ : 1993, మార్చి

ప్రతులు : వేయి

ముద్రణ :

సత్యసోమా ప్రింటర్స్,
భారతమాత సెంటర్,
సూర్యారావుపేట, కాకినాడ-1.



ముఖచిత్ర రచన :

శ్రీ కట్టా సుబ్బారావు,
సామర్లకోట.

ముఖ పత్రం :

రామ్‌షా శిరీషా ప్రింటింగ్ ప్రెస్,
సామర్లకోట.

ప్రాప్తి స్థానము :

డాక్టర్ వక్కలంక లక్ష్మీపతిరావు,
భూపయ్య అగ్రహారము,
అమలాపురం-533 201.

మూల్యము : రూ. 15/-

# అంకితం



నాకు మానవజన్మ మిచ్చి ప్రేమామృతం పంచి

నన్ను పెంచినఅమ్మానాన్నలు

**అచ్చాయమ్మ, వక్కలంక సుబ్బారావు**

**పుణ్యదంపతులకు**

భక్తిప్రేమలతో

**డా॥ వక్కలంక లక్ష్మీపతిరావు**

1-3-1993

**అమలాపురం**

# కృతజ్ఞతలు

ఈదేశభక్తిగేయాలు నాచే వ్రాయింపించి ప్రసారం చేస్తున్న ఆకాశవాణి విజయవాడ, విశాఖపట్నం కేంద్రాలకూ ఈ పుస్తక ముద్రణకు అయిదువేలరూపాయి లందించిన ఆంధ్రప్రదేశ్ పేపర్ మిల్స్ రాజమండ్రీవారికీ, వారికి నాపేరు సిఫారసు చేసిన రస హృదయులు తూర్పుగోదావరిజిల్లాకలక్టర్ శ్రీ రణదీప్‌సూదన్ I.A.S. గారికీ వినమ్రముడనై కృతజ్ఞతాంజలు లర్పిస్తున్నాను.

ఈపుస్తకాన్ని ముచ్చటగా ముద్రించి యిచ్చిన సత్యసోమా ప్రింటర్స్‌వారికీ, ముఖచిత్రం రచించినమిత్రులు శ్రీకట్టా సుబ్బారావు గారికీ టైటిలుపేజీ ప్రింటు చేసి యిచ్చినసామర్లకోటరామ్‌షాశిరీషా ప్రెస్‌యజమాని డాక్టర్ పూషాగారికీ కృతజ్ఞతలు.

అమలాపురం,
1-3-1993

ఇట్లు
డా॥ వక్కలంక లక్ష్మీపతిరావు



# స్వాతంత్ర్యదీప్తి

## ఇదీవరస

# స్వాతంత్ర్యదీప్తి

## 1

మనభారతదేశచరిత
మహామధురకావ్యం!
శాంతిశౌర్యరసపూర్ణో
జ్జ్వలసుందరసుమధురకావ్యం !

ఎంతమందిత్యాగఫలం
ఈస్వతంత్రభారతదేశం !
జనతాసమతామమతల
సదాశయం ఈదేశం !

పరతంత్రతవైపునుండి
స్వాతంత్ర్యముదిశగా
హింసామార్గమును రోసి
బుద్ధునిబోధలదెనగా

పచునించేయీాదేశం
అందించేసందేశం
విన్నారా ? కన్నారా ?
కన్నతల్లిఆదేశం ?

"అసతో మా స ద్గమయ
తమసో మా జ్యోతి ర్గమయ
మృత్యో ర్మా అమృతమ్ గమయ."

స్వాతంత్ర్యదీప్తి

మనపవిత్రదేశచరిత
మహామధురకావ్యం !
శాంతిశౌర్యరసపూర్ణో
జ్వలసుందరసుమధురకావ్యం !!



## 2

ఈదేశం ! మాదేశం !
భారతదేశం మాదేశం !

పరులముందు తల వంచనిరాణా
ప్రతాపు పుట్టిన దీదేశం !
రుద్రమదేవుల ఝాన్సీలక్ష్మల
రూపొందించిన దీదేశం !

రసహృదయులు సమ్రాట్టులు కవులకు
పల్లకి పట్టిన దీదేశం!
ఱాల్ కరగించెడిఅమరగానమున
పరవశించినది మాదేశం!

ఈదేశం ! మాదేశం !
భారతదేశం మాదేశం !

మొగలుగుండెలో పొంగినప్రేమకు
ప్రాణము పోసిన దీదేశం !
బండఱాళ్లకును భావావేశము
నలవరించినది మాదేశం !

అణువణువున ఆత్మాభిమానమే
ప్రస్ఫుట మౌ నిది నాదేశం!
పరమసాధ్వులను కని పులకించిన
పవిత్రదేశం మాదేశం !

## స్వాతంత్ర్యదీప్తి

ఈదేశం మాదేశం!
భారతదేశం మాదేశం!

బుద్ధుడు శంకరభగవత్పాదులు
పుట్టి పెరిగినది మాదేశం!
ఆపరమాత్ముడు రామకృష్ణులుగ
అవతరించినది మాదేశం!

కర్మవీరులను ధర్మవీరులను
కని పెంచిన దిది మాదేశం!
శాంతిదూతలను జగతి కొసంగిన
స్వతంత్రదేశం మాదేశం!

ఈదేశం మాదేశం!
భారతదేశం మాదేశం!



**3**

అది కాఱువీకటి నల్లాడుభారతా
వని కెల్ల వెలు గొసంగినయుషస్సు!

అది ధర్మదేవతవదనమ్ము లేతన
వ్వులతోడ విరబూయుపుణ్యదినము!

అది మానవాకృతి నంది ఒక్కమహస్సు
దివినుండి భువికి నేతెంచుపర్వము!

అది మహాసమ్రాట్టు నదలించునొకనిరా
యుధశక్తి పొత్తిళ్ల నొదుగుదినము!

శాంతిదేవత కన్నీటిచార తుడువ
నొకఅహింసాతపస్వి సముద్భవించు
పర్వదిన మది! అది భారతోర్వి కెల్ల
దివ్యసంక్రాంతి! - అదియె గాంధీజయంతి!"



## 4

ముతకఖద్దరులోన సతిమెత్తనియెడంద
దాచుకొన్నట్టి ఉదారులకును

పండువెన్నెలవంటినిండుజవ్వన మెల్ల
చెఱసాలపాల్ చేయుచెలువలకును

స్వాతంత్ర్యసమరదీక్షాసక్తి యెద పొంగి
తమసర్వ మిచ్చినత్యాగులకును

చిఱునవ్వు మోమున చిందించి లాటీకి
తనువు లర్పించినధన్యులకును

గొడ్డటం దమ్ము తెగనేయుకుమతికైన
తమవలపు పంచుచందనతరువులట్లు
చెంపపై కొట్ట వేఱొకచెంప చూపు
ధీరులకు జన్మభూమి మా భారతమ్ము !



## 5

మంచుకొండ కాదా? అది
అమ్మమణికిరీటమా?
కడలిరాజు కాడా? అత
డమ్మపాద సేవకుడా?

కోనసీమ కాదా? అది
నవభారతనందనమా?
గంగానది కాదా? అది
అమ్మకంఠహారమా?

సింహాళపదపీఠముపై
పారాణిపదమ్ము లుంచి
హస్తినసింహాసనమున
అధివసించుమాతల్లికి

అమ్మకు భారతమాతకు
అందఱిఅభివందనాలు!
కన్నతల్లిగళసీమకు
కవితాసుమహారాలు!



## 6

పండుగరోజు! బ్రతుకు పండినరోజు !
నిఖిలజగతి మాతల్లికి నీరాజన మిచ్చినరోజు !

శతాబ్దాలశృంఖలాలు ఛేదించినరోజు !
జాతిజీవితాన నూత్నచైతన్యం విరిసినరోజు !

శిరములు హిమశైలోన్నతశిఖరము లై నిలిచినరోజు !
మంచుకొండఅంచులలో మాజెండా యెగిరినరోజు !

పువ్వు పువ్వు నవ్వినరోజు !
పుడమితల్లి పులకించినరోజు !
స్వాతంత్ర్యలక్ష్మి మాప్రాంగణాన
తెలినవ్వులు కురిసినరోజు !

కలవాడూ లేనివాడు కలకల నవ్వినరోజు !
కన్నుల పన్నీరు నించి కన్నతల్లి దీవించినరోజు !
దిగంతాలలో దృగంతాలలో
త్రివర్ణకేతన మెగిరేరోజు !

జనగణ మంతా ముక్తకంఠమున
జయహిం దంటూ పాగేరోజు !
పండుగరోజు! బ్రతుకు పండినరోజు !
మఱపు రాని మధుర మైనమానధనులపండుగరోజు !



# 7

హిమగిరి తెల్లనా
జలనిధి నల్లనా
ఈరెంటినడుమ నా
కన్నతల్లి పచ్చనా !

గంగమ్మ తెల్లనా!
యమునమ్మ నల్లనా !
గంగ యమున కలసితే
తెల్లతెల్లనల్లనా !

కన్నతల్లివిమలకీర్తి
గంగవలె తెల్లనా !
మల్లెవలె చల్లనా !
మనసల్లె తీయనా !

కొమ్మలు పచ్చనా !
కోకిల నల్లనా !
కోకిలమ్మగొంతులో
గానము తీయనా !

కోకిల నే నై
గానము చేయనా ?
కన్నతల్లికీర్తి నే
గానము చేయనా ?

స్వాతంత్ర్యదీప్తి

అమ్మఒడి వెచ్చనా!
ఆమెచూపు చల్లనా!
అమ్మపాట పాడుకొనే
బ్రతు కంతా తీయనా!

హిమగిరి తెల్లనా!
జలనిధి నల్లనా!
ఈరెంటినడుమ నా!
కన్నతల్లి పచ్చనా!



# 8

ఇది స్వతంత్రదినోత్సవం
ఇది పతాకదినోత్సవం!
ఇది హిమాచలసేతుమధ్యమ
హీప్రజానయనోత్సవం!

మాతృదాస్యము తలగద్రోసిన
మానధనులమహోత్సవం!
భారతీయమహాజనావళి
బ్రతుకు పండినఉత్సవం

దేశరక్షకు పోరు లందఱు
దీక్ష గైకొనుఉత్సవం!
అమరవీరులదేశభక్తికి
అంజలించుమహోత్సవం!

మనపతాకము లాల్ ఖిలాపై
మొనసి యెగిరేఉత్సవం
బాపుజీజవ్హరులు కని దీ
వనలు కురిసేఉత్సవం!

భరతమాతకు ప్రజలు హృదయా
ర్పణ మొనర్చుమహోత్సవం!
ఉల్లముల జాతీయభావము
ఉరక లేసేఉత్సవం!

## స్వాతంత్ర్యదీప్తి

అమ్మ భారతి విజయగీతిక
లాలపించుమహోత్సవం !
శ్రావ్యముగ "జయహింద్" సినాదము
జగతి నిండుమహోత్సవం !

ఇది స్వతంత్రదినోత్సవం !
ఇది పతాకదినోత్సవం !
ఇది హిమాచలసేతుమధ్యమ
హీప్రజానయనోత్సవం !



## 9

ఎగరాలి యెగరాలి మువ్వన్నె జెండా!
మనజాతిఅరవప్రాణ మీజెండా !

దివ్యదీధితు లొలసి గగనాంచలము లొరసి
కడలిఅంచులు దరిసి మనకనులలో మెరసి

ఎగరాలి యెగరాలి మనజాతిజెండా!
ఎగరాలి యెగరాలి మువ్వన్నె జెండా !

స్వాతంత్ర్యసమరయోధులత్యాగములు కనుల
కట్టించు నీపతాకములోనియెరుపు !

సస్యామలం బౌచు సుశ్యామలం బైన
మనపంటపొలము బోలెడుఆకుపసుపూ !

శాంతిపావుర మౌచు జగ మెల్ల విహరించు
భారతీయతకు అద్దము పట్టు ఆతెలుపు !

మూడురంగులు కూడి ఈరేడులోకాల
ఈడు లే దనిపించుమనజాతిజెండా !

ఎగరాలి యెగరాలి మువ్వన్నె జెండా !
భారతీయులకలలు పండించుజెండా !



# 10

నీపాటలే పాడనా ?
నాతల్లి !
నీమాటలే ఆడనా ?

నీనవ్వువెన్నెలలె
మంచుకొండగ పూచె !
నీపదార్చనజలమె
నిండుకడలిగ తోచె !

నీపాద సేవకులె
నేత లై వెలుగగా
నీయంగరక్షకులె
సైన్య మై మెలగగా

నీపాటలే పాడనా ?
నాతల్లి !
నీమాటలే ఆడనా ?

గంగాతరంగాల
సంగీతభంగిమలు
నీగానమధురిమకు
నీరాజనాలు !

వలపు వాడనికావ్య
పారిజాతసుమాలు
ఒకళామయి ! నీకు
మాపూజనాలు !

పలుకుపలుకున తేనె
లొలుకునీమాటలో
అణువణువు స్వర్గ మై
వెలుగునీకులుకులో !
మురిసేము - మము మేము
మఱచేము తల్లీ !

ఎన్నిజన్మలతపము
ఈనాడు పండెనో !-
ఈజన్మలో నీకు
బిడ్డ లైనాము !

నీపాటలే పాడమా ?
మాతల్లి !
నీమాటలే ఆడమా ?
వీరప్రసూతా ! భారతమాతా !
ఓకల్పవల్లీ ! మము గన్నతల్లీ !

నీపాటలే పాడమా !
నీమాటలే ఆడమా !



## 11

తే.గీ. ఒకయశోకుడు ఒకబుద్ధు డొక్కక్రీస్తు
ఒక్కరూ పయి ఆతడు రూపొందినాడు!
ఆమహాత్ముడు "రామ! రామా!" యటంచు
తనువు చాలించి అమరు డై తరలినాడు!

సీ. ఇది శాంతిదేవతయెడద రక్తము చిందె
వరద లై ప్రవహించుపాడురోజు!

ఇది భారతప్రధానివదనమ్ము కన్నీట
దోగిపోయినమహాదుర్దినమ్ము!

ఇది ధర్మదేవతహృదయమ్ము బ్రద్ద లై
దురపిల్లిపోయినదుర్ముహూర్త!

మిది విశ్వమానవహృదయాన గాఢాంధ
కారముల్ క్రమ్మినకాళరాత్రి!

తే.గీ. ఇది అహింసాతపస్విని హింసతోడ
పట్టపగటనె తెగబడి పొట్ట బెట్టు
కొన్ననాజాతి తల యెత్తుకొనగలేక
తొట్రుపడి క్రుంగిపోయినదుర్దినమ్ము!

సీ. అమరత్వమును రాక్షసము పట్టి దిగద్రొక్కి
శివ మెత్తి తాండవించినది నేడు!
పరిపూర్ణమానవత్వము గుండుదెబ్బకు
ఎదురేగి ఒరిగిపోయినది నేడు!
రఘుపతిరాఘవరామసంకీర్తనం
బిల యెల్ల మూగవోయినది నేడు!
బోసినవ్వులతాతహాసమ్ము కఱవైన
దని ప్రపంచము తపించినది నేడు!

తే.గీ. విశ్వమున కెల్ల వెలుగు చూపినధరిత్రి
యిరులకడలిని మునిగిపోయినది నేడు!
భారతీయమహాజనావళికి బ్రతుకు
చితికి మాయనిమచ్చ వచ్చినది నేడు!!



# 12

శిరములు హిమశైలోన్నతశిఖరము లై నిలవాలి !
మంచుకొండఅంచులలో మనజెండా యెగరాలి !

మనభారతనందనాన మధుమాసం విరియాలి !
పేదవాడిగుండెల్లో విరిజల్లులు కురియాలి !

గులాబిపూవులసరసన గుడ్డిపువ్వులూ నవ్వాలి !
గుడ్డిపువ్వులూ నవ్వాలి- గడ్డిపువ్వులూ నవ్వాలి !

కలతలకన్నీటిబ్రతుకు కమ్మనికల కావాలి !
అమవసగుండెలు చీల్చుకు పున్నమ విరబూయాలి !

గళముగళమునా ఒకసింహం గర్జించాలి !
పిలుపుపిలుపునా అమృతం ప్రవహించాలి !

జనగణమనగానంలో జగతి పరవశించాలి !
జనహృదయం సముద్ర మై జయ హిం దని ఘోషించాలి

మబ్బుతెరలు చీల్చుకొనుచు మనజెండా యెగరాలి !
కన్నతల్లికన్నులలో కమ్మనికల పండాలి !

శిరములు హిమశైలోన్నతశిఖరము లై నిలవాలి !
మంచుకొండఅంచులలో మనజెండా యెగరాలి !



## 13

అందఱమూ ఒకటే !
మన మందఱ మొకటే !

తార లెన్ని వెలిగినా
తారాపథ మొకటే !
తరగ లెన్ని పొంగినా
అంభోనిధి ఒకటే !

కిరణాలు వేయి ఉన్నా
వెలిగేసూర్యు డొకడే !
చరణాలు ఎన్ని ఉన్నా
పాడేపాట ఒకటే !

ఎన్ని రేకు లున్నాకానీ
ఉన్నపూవు ఒక్కటే !
భాష లెన్ని పలికినా
భారతాత్మ ఒక్కటే !

తనయుల మెందఱ మున్నా
తల్లి ఒక్కతే !
కన్నతల్లి ఒక్కతే !

## స్వాతంత్ర్యదీప్తి

హిందూ ముస్లిము లెందఱు మునా
భారతీయులం అంతా ఒకటే!

భారతీయులం అంతా ఒకటే!
భారతాత్మ అంతా ఒకటే!

అందఱమూ ఒకటే!
మన మందఱ మొకటే!



# 14

మాతృదాస్య మెడలించినమానధనులపండుగరోజు !
హింసపై అహింస గెలిచి జెండా యెగరేసినరోజు !

తల వంపై క్రుంగినప్రజ తల యెత్తుకు తిరిగేరోజు !
మనసు మనసు కలుపుకొన్న మానవతకు పండుగరోజు !

అమరవీరులందఱకును అంజలి ఘటియించేరోజు !
శాంతిపావురము లై ప్రజస్వాంతములే యెగసినరోజు !

కనులనిండుగా వెలిగేజెండాపండుగరోజు !
ఏటేటా వచ్చి పలుకరించి పోవుపండుగరోజు !

పండుగరోజు !
జెండాపండుగరోజు !



## 15

భారతజనయిత్రీ !
హేభారతజనయిత్రీ !
ప్రియతమభారతధరిత్రి !
నవశిరీషసుమగాత్రీ !

హిమగిరిమణికోటీరా !
సురగంగామణిహారా !
జనతాఘనతాపహరణ
నయనామృతవర్షధార !

కోటికోటిజననేత్రీ !
శౌర్యగుణాంచితధాత్రీ !
నవశోభాసంధాత్రీ !
వినయాంచితశుభగాత్రీ !

జలనిధిగంభీరగుణా !
శాంతిశౌర్యనికేతనా !
సౌభాగ్యత్యాగస్వచ్ఛ
తాత్రివర్ణకేతనా !

భారతజనయిత్రీ !
హేభారతజనయిత్రీ !
ప్రియతమభారతపవిత్రి !
నవశిరీషసుమగాత్రీ !

భారతజనయిత్రీ !
హేభారతజనయిత్రీ !



## 16

తనమాట సకలహైందవకోటి తల దాల్చు
మురిపెంపువరహాలమూట గాగ
తననీతిశ్రీమారణాస్త్రప్రకంపిత మైన
జగతికి జీవనౌషధము గాగ
తననిరాడంబరత్యాగశీలోన్నతి
భారతీయుల కొజ్జబంతి గాగ
తనవచోగతి సమస్తప్రపంచప్రజా
తతికి సమ్మోహనాస్త్రమ్ము గాగ

ప్రథితరాజ్యాంగతంత్రసామర్థ్య మూని
దిగ్దిగంతాల శాంతిసందేశ మొసగి
విశ్వకల్యాణనిరతు డై వినుతి గాంచె
శాంతిపారావతమ్ము మాబాపురుండు !



## 17

అందాలహరివిల్లు మనభారతం !
నందనోద్యాన మీనవభారతం !

నవనవాంబరమట్లు నవ్వువెన్నెల విరియు !
ఎడద రగిలిననాడు పిడుగులే కురియు !

బోసినవ్వులలోన పూచేఅహింసా
ఎఱ్ఱనిగులాబీల శాంతిసందేశం !
మనతల్లిసిగలోన నవపారిజాతాలు !
మనజాతిమహనీయకీర్తిసంకేతాలు !

గంగాతరంగాల పొంగారుతెలుపూ
కొమరారుయమునలో కులికేటినలుపూ
తెలుపునలుపులలోన దివ్యదీధితు లొలయు
ఆసరస్వతిమందహాసం !
కలబోసికొను త్రివేణీసంగమం !

పలుజాతిపూలు కలనవనందనం !
అందాలరాశిరా మనభారతం !

కమనీయకవనాలతీయందనాలు !
కనులలో జాబిల్లిచల్లందనాలు !
ఉర్వి నుఱ్ఱూగించుఉపవాసదీక్షా
గుండుదెబ్బ నెదుర్చుగుండెనిబ్బరమూ
అసువులను బలియొసగుఆత్మాభిమానం

### స్వాతంత్ర్యదీప్తి

భువనాల నెట లేనిభూరిప్రతాపాలు
శూరు లంపెడుశాంతిపారావతాలు
హరివిల్లులో రంగు లై పూచురా !
అమ్మ మన సాకాశ మై తోచురా !

అందాలహరివిల్లు మనజీవితం !
నందనోద్యాన మీనవభారతం !!



## 18

హిమశైలోన్నతు డితండు
ఎవ రోయీ? యెవ రోయీ?
అంభోధిగభీరు డీత
డెవ రోయీ? ఎవ రోయీ?

హృదయ మెల్ల వెన్న యైన
యిత డచలేశ్వరు డౌనా?
ఆస్వచ్ఛత- ఆయున్నతి
అతడే యిత డనిపించును!

ఉపదేశము! ఆదేశము!
ఉర్వి కొనగు సందేశము!
భూసురుడో! భూవరుడో!
తేజోభాసురు డితండు!

ప్రాజ్ఞులతో సహవాసము!
రాజభవన మావాసము!
ఎవరో యీకర్మయోగి?
ఎవ రీదేవేంద్రభోగి?

శిరమున ఉష్ణీషమట్లు
చెలువారుకిరీట మేమి?
ఉపనిషదమృతస్రవంతి
ఉబికెడుఆవాణి యేమి?

స్వాతంత్ర్యదీప్తి

ప్రాక్పశ్చిమఖండములకు
వారధి యై నిలిచినాడు !
ఆతడు రాధాకృష్ణుడ?
పుంభావసరస్వతియా?

ఆతడు మనరాష్ట్రపతియ?
ఆర్షభూమి కధిపతియా !!



## 19

విశ్వశాంతిపవిత్రి నను గన్నతల్లి!
వీరభారతనేత్రి నను గన్నతల్లి!

ఇంతచల్లనితల్లి యింకొకతె కనరాదు!
ఇట్టివీరప్రసవ యిక నెందు కనరాదు!

అన్నివిద్యలలోన అమ్మయే కనిపించు!
అన్నిమతములలోన అమ్మరూపమె తోచు!

భారతీయుడ నన్నపే రొక్కటే చాలు-
నీరాజనం బిచ్చు నీరేడులోకాలు!

ఈగాలి- ఈనేల- యీపవిత్రజలాలు-
ఇచటిప్రత్యణువు నాయెదకు వెన్నెలజాలు!

ఇచట జన్మించినా నెంతపుణ్యమ్మొ!
ఇచ్చోటినాజన్మ మెంతధన్యమ్మొ!

విశ్వశాంతిపవిత్రి నను గన్నతల్లి!
వీరభారతనేత్రి నను గన్నతల్లి!!



# 20

జయ జవాన్ ! జయ కిసాన్ !
జయ జవాన్ ! జయ కిసాన్ !

బడిపంతులుకొడుకు కొకడు భారత
ప్రధాని యై వెలిగినాడు !
అతడే మనలాల్ బహదూర్ !
అతడే మనశాస్త్రీజీ !

చిన్నప్పుడు రేవు దాట
చిల్లిగవ్వ లేనప్పుడు
గంగానది ఈది అవలి
గట్టు చేరుకొన్నా డట !

పొట్టివాడు గట్టివాడు !
పట్టు విడుపు ఉన్నవాడు !
గాంధీపిలు పందుకొని
కాంగ్రెసులో చేరినాడు !

దొరలను ఎదిరించినాడు !
చెఱలో పడి క్రుగ్గినాడు !
మంత్రిపదవు లందినాడు !
మరల విడిచిపెట్టినాడు !

## స్వాతంత్ర్యదీప్తి

కాశ్మీరున రాజకీయ
కార్యము నెరవేర్ప బోయి
చలికో టెరువుగ నెహ్రూ
వలన కొనినపేద అతడు !

నిప్పువంటిమనిషి అతడు!
నిజాయితీ వీడలేదు !
పదవులకై చూడలేదు !
పైస నిల్వ చేయలేదు !

కార్యదీక్ష దేశభక్తి
కలిగిన లో టే మున్నది?
భరతావని నిరుపేదయు
ప్రధాని యగుపీ లున్నది !

పండిట్ జీపిదప అతడు
ప్రధాని యై నెగడినాడు !
దండెత్తినపాక్ సేనల
దండింపగ బూనినాడు !

పూవువంటిమనసులోనె
చేవలు నిండించినాడు !
కాశ్మీరయోధులకు వీర
గంధము నందించినాడు !

పంట తక్కు వైనప్పుడు
ప్రజలకు ఆదర్శముగా
వారమునకు ఒక్కపూట
పస్తున్నా డాప్రధాని !

శాంతియాత్రకై ఆతా
ష్కంటున కత డరిగినాడు !
ఒకకమ్మనికలవలె అత
డకటకటా ! కరగినాడు !

భరతమాతపదార్చనకు
బ్రతుకు హార తిచ్చినాడు !
ప్రజాసేవ చేయుచునే
పరులగడ్డ నొరిగినాడు !

పుడమి రాలి పరిమళించు
బొగడపూవు లాల్ బహదూర్ !
భరతజాతి యున్నంతకు
చిరంజీవి లాల్ బహదూర్ !



## 21

భారతీయసోదరా!
వీరశంఖ మూదరా!
కర్మభూమి మనదిరా!
ధర్మభూమి మనదిరా!

తాత్త్వికు డధ్యక్షు డైన
తపోవనం మనదిరా!
లలితకళాసుమపరిమళ
కలితవనం మనదిరా!

సత్యాహింసావీరుల
జన్మభూమి మనదిరా!
ధర్మవీరులను కాంచిన
కర్మభూమి మనదిరా!

శాంతిదూత పయనించిన
క్రాంతిపథం మనదిరా!
శాస్త్రీజీ నడిపించిన
జైత్రరథం మనదిరా!

విశ్వశాంతికాముకులం!
విశ్వజనప్రేమికులం!
మానవతా వాదుల మై
మంచి పంచశ్రామికులం!

భరతావని మనదిరా!
బహు పావని మనదిరా!
విబుధావని మనదిరా!
విపులావని మనదిరా!

బహుపావని విబుధావని
భరతావని మనదిరా!
భారతీయసోదరా!
వీరశంఖ మూదరా!



## 22

భారతం! భారతం!
ఇది స్వతంత్రభారతం!
ఇదే వీరభారతం!

హిమగిరిలా ఉన్నత మైనది!
జలనిధిలా గభీర మైనది!
హిమగిరినీ జలనిధినీ
ఇరువైపుల నిలుపుకొన్నది!

చందమామవెన్నెలంటి
శాంతికాముకత ఉన్నది!
గ్రీష్మాతపమును మించిన
ప్రతాపమూ తన కున్నది!

తనకోసం ప్రాణ మిచ్చు
త్యాగవీరులను కన్నది!
కళాజగత్ స్రష్టలైన
కాళిదాసులను కన్నది!

అణ్వస్త్రక్షుభితజగతి
కాశాజ్యోతిగ నున్నది!
సత్యాహింసామంత్రము
సర్వదా జపిస్తున్నది!

భారతం! భారతం!
ఇదీ స్వతంత్రభారతం!
ఇదే వీరభారతం!



# 23

మాభారతజనయిత్రికి వందనాలు! వందనాలు!
జననిపేరు వినగానే యెదయెదలో స్పందనాలు!

అరుణరుధిర మర్పింతుము తల్లికి హరిచందనాలు!
ఈ ప్రియతమధాత్రి యుండ ఎందుకు మఱి నందనాలు?

తూరుపుదిక్కున సంధ్యారాగం!
అది మాయెదలో కుసుమపరాగం!

మనసు మనసు పూజాసుమాలుగా
జనని కిత్తుమా సమభాగం!

గంగాతరంగాల సంగీతభంగిమలు
మాతల్లికి నిరంతరం మంగళగానం!

ఉరకలతో పరుగులతో ఉప్పొంగేనదీజలం
స్పందించేతల్లియెడద అందించేరాగరసం!

మాభారతజనయిత్రికి వందనాలు వందనాలు!
జననిపేరు వినగానే యెదయెదలో స్పందనాలు!



## 24

ఒకేకంటిలో నున్నవి
హర్షదుఃఖబాష్పాలు !
ఒకేతల్లిబిడ్డలురా !
దరిద్రుడూ ధనవంతుడు !

ఒకేనాల్కపై నున్నవి
రకరకాలరుచులు !
ఒకేగడ్డపై నున్నవి
ఎన్నెన్నో మతాలు !

ఒకేనింగిపై నున్నవి
కోట్లకొలది తారలు !
ఒకేపొదను పూస్తున్నవి
రకరకాలపరిమళాలు !

ఒకేతల్లిగర్భమునం
దుదయించినబిడ్డలం !
ఒకేయింద్రధనువులో
రంగుల మై వెలుగుదాం !



# 25

ఏనోట విన్నా నీపాటలే !
ఏచోట విన్నా నీమాటలే !
శతాబ్దాలశృంఖలాలు
ఛేదించినతల్లీ !
జాతిజీవితాన నూత్న
చైతన్యం నించినతల్లీ !

కన్నతల్లి ! కల్పవల్లి !
ఓభారతజనయిత్రీ !
సస్యామలసుశ్యామల
శాంతిశౌర్యశుభగాత్రీ !

ఆసేతుహిమాచలమ్ము
అగుపించును నీరూపే !
వేలువేలుభాషలలో
వినిపించును నీపిలుపే !

నీపొలాలపచ్చదనం
నీఒడిలో వెచ్చదనం
నీచూపులచల్లదనం
నీనవ్వులతెల్లదనం

నీకీర్తిని రేబవళ్లు
పాడుతున్న దానంద్రం !
నీయశఃపతాకముగా
నింగి నంటు హిమాలయం !

## స్వాతంత్ర్యదీప్తి

ఏనోట విన్నా నీపాటలే !
ఏచోట విన్నా నీమాటలే !

కన్నతల్లి ! కల్పవల్లి !
భారతజనయిత్రీ !
సస్యామలసుశ్యామల
శాంతిశౌర్యశుభగాత్రీ !



## 26

అభివందన మోభారతధాత్రీ !
వందన మమ్మా ! జనయిత్రీ!
హే భారతజనయిత్రీ !
విశ్వశాంతిసంధాత్రీ !
ధగద్ధగితగగనభాగ
వరత్రివర్ణకేతనా !
సకలవిశ్వసుఖకారణ
శాంతిమహితనికేతనా !
రసమయసంగీతలస
జ్జలనిధిచుంబితచరణా !
లలితకళాపరిపోషణ
మృదుభాషణతోషణా !
అరివీరమహాభీకర
శౌర్యగుణాభరణా !
నవనీతహృదంతరాళ
నయనాంచితకరుణా !
విశ్వశాంతిసంధాత్రీ!
హే భారతజనయిత్రీ !
అభివందన మోభారతధాత్రీ !
వందనమమ్మా ! జనయిత్రీ !
వందనమమ్మా ! జనయిత్రీ :



## 27

నిజమా ? ఇది నిజమేనా ?
కన్నులలో నీరు చెప్పు
కానిమాట నిజమేనా ?
అఖిలభారతావనికిని
అమ్మ యింక కరవేనా ?

ఇందిరమ్మ ఔన్నత్యము
హిమాద్రి కాజేసేనా ?
ఆహృదయములోనిలోతు
లంబుధిలో కలసేనా ?

విశ్వశాంతికై శ్రమించు
వాణి యింక వినబడదా?
బడుగువర్గములపాలిటి
భాగ్యరాశి కనబడదా?

ఆకన్నులలో వెలుగులు
రవిచంద్రుల చేరేనా?
అహింస పుట్టినభూమికి
అశ్రువులే మిగిలేనా?

నిజమా?
ఇది నిజమేనా?



## 28

అన్నపూర్ణ యీదేశం !
అందఱిదీ యీదేశం !
అందించును ఈదేశం
విశ్వశాంతిసందేశం!

ఎన్నిమతా లెన్నికులా
లెన్నివేషభాషలో !
అన్నిమతా లన్నిభాష
లమ్మకు మణిభూషలే !

ఇది సహస్రదళపద్మం
ఈభారతసద్మం!
రేకు రేకు విడగొడితే
ఉంటుందా యిక పద్మం?

మతంపేర చేయకండి
మారణహోమం !
అలజడి సృష్టించకండి
ఇది ప్రశాంతిధామం !

మానవతను కాల రాచు
మత ముంటుందా?
మతం మతం కలహిస్తే
మనుగడ ఉంటుందా?

## స్వాతంత్ర్యదీప్తి

పుణ్యభూమి యీదేశం
నవభారతదేశం !
అందించును అందరికీ
విశ్వశాంతిసందేశం !

అన్నపూర్ణ యీదేశం !
అందరిదీ యీదేశం !



## 29

వందనమమ్మా ! వేదధరిత్రీ !
అభివందన మోభారతధాత్రీ !
కోటికోటిజననేత్రీ !
విశ్వశాంతిసంధాత్రీ !
ఓభారతధాత్రీ !

హస్తినాపురీవిలసిత
రత్నఖచితసింహపీఠ !
హే సింహాళపదపీఠా !
హిమగిరీంద్రమణిమకుటా !
సుమగాత్రీ ! పుణ్యధాత్రి !
ప్రియభారతజనయిత్రీ !

ఓనవమ్మృదుమంజులపద
లలితకావ్యవిభూషణా !
సత్యాహింసావితరణ
గుణగణపరితోషణా !

శరణాగతపరిరక్షణ
బిరుదాంచితపుత్రపుత్రి !
హే సురభిళసుమగాత్రీ !
శాంతశౌర్యసంధాత్రీ !

స్వాతంత్రదీప్తి

కోటికోటిజననేత్రీ !
ప్రియతమభారతధరిత్రీ!
అభివందన మోపుణ్యధరిత్రీ !
వందనమమ్మా ! సుమగాత్రీ !

భారతధాత్రీ !
ప్రియతమభారతధాత్రీ !



# 30

నెహ్రూ మనుమడు ఇందిర
కడుపుపంట రాజీవ్‌జీ
తల్లి గతించిన దాదిగ
భారతరాజ్యేంద్రిరరథ
సారథి యై వెలిగినాడు !

కన్నులలో రాచఠీవి
నడకలలో అతివేగము
మొగ మంతా చిఱునవ్వులు
విరబూసినసౌమ్యు డతడు !

ఎన్నికలప్రచారములో
శ్రీపెరంబుదూరునందు
గోవువంటిరాజీవును
కుమతులు పరిమార్చినారు !

గాంధీ అను పేరులోన
కలవిచిత్ర మేమో మరి !
ముగ్గురు గాంధీలుకూడ
బలవన్మరణము పొందిరి !

## స్వాతంత్ర్యదీప్తి

అఖండభారత మంతా
అశ్రుపూర్ణ మైపోయెను !
గుండె గుండె రాజీవుని
గుడి యై ఇల వెలుఃవొందెను !

భారతప్రభుత్వ మాతని
స్మృతికి జోహారులు చేసెను !
'భారతరత్నం' బనియెడు
గౌరవ మిడి నతి చేసెను !



# 31

నవభారతనందనాన
వలపు లొలుకుపువ్వుల్లారా !
తెలుగుతల్లివదనమ్మున
విరిసినచిరునవ్వుల్లారా !
నవతావాదుల్లారా !
మానవతావాదుల్లారా !
నవచైతన్యం ఉరకలు వేసే
యువతీయువకుల్లారా !
భారతయువతీయువకుల్లారా !
నవభారతనిర్మాతల్లారా !

ఆసేతుహిమాచలాన
అగుపించే దొకరూపే !
వేలువేలుభాషలలో
వినిపించే దొకపిలుపే !

రేకులు వే ఱైనా కానీ
వికసించేపూ వొకటే !
వేలువేలురంగులు ఉన్నా
విరిసేహరివి ల్లొకటే !

అణగారేఅన్నాదమ్ముల
ఆర్తనాదములు ఆలించండీ !
తీయనితలపులతేనెమనసుతో
దేశసేవకై తరలండీ !

స్వాతంత్ర్యదీప్తి

మమతాశంఖము పూరించండీ!
సమతాజ్యోతులు వెలిగించండీ!
స్వతంత్రభారతపతాకనీడల
'జయహిం' దంటూ సాగండీ!

వందే మాతరం!
వందే మాతరం!!



# 31

నా దేశంలో వెదుళ్ళు
వేణువు లై పాడితే
శిల లిక్కడ జవరాండ్రై
సొంపుగ నర్తించేను !

అమ్మకు మణికిరీటమై
హిమగిరి చెలు వొందగా
తల్లికీర్తి ననుకరిస్తు
వెన్నెల విరబూసేను !

భరతమాతకీర్తినే
ఉదధి పొంగి పాడుతూ
భక్తితోడ తల్లి కర్ఘ్య
పాద్యము లర్పించేను !

నా దేశం సుమపరిమళ
నందన మై విరబూయగ
అందాలకు బందీ యై
డెందము స్పందించేను !

నా దేశంలో వెదుళ్ళు
వేణువు లై పాడగా
శిల లిక్కడ జవరాం డ్రై
సొంపుగ నర్తించేను !



## 32

భారతీయబాలలం!
భావితరం నేతలం!
లేతలేతమొగ్గలం!
తీపితీపిఆశలం!

నింగినుండి దిగి వచ్చినవెన్నెలలం!
రాగమధువులను చిలికేకిన్నెరలం!
భరతమాతముంగిటిలో వెలిగేమణిదీపాలం
పిల్లలం! విరిజల్లులం!

సత్యాహింసాబుషి బాపూజీ
శాంతిదూత మాచాచా నెహురూ
పయనించినమార్గంలో
వెలిగేదీపికలం!

నిన్నటిరవరవలు మఱచి
నేటిస్నేహమే వలచి
అందఱితో జత కలిపే
ప్రపంచైకబాలలం!

## స్వాతంత్ర్యదీప్తి

శాంతిపావురాల మయి
జగ మంతా విహరిస్తాం !
వసుధైకకుటుంబానికి
వారధులే నిర్మిస్తాం !

భారతీయబాలలం !
భావితరంనేతలం !
అందఱికీ వెలుగు పంచు
ఆశాదీపికలం !!

